ఖమ్మం జిల్లాలో 37– ఎ క్రింద రక్షిత కౌలుదారులుగా గుర్తింపబడిన వారికి 38–ఇ ని వర్తింపజేసి భూములపై యాజమాన్యపు హక్కు కల్పించనందుకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

ఖమ్మం జిల్లాలో కౌలుదారీ శాసనం యొక్క 53–సి, జి. లను అమలు జరిపి పేదరైతులకు వ్యవసాయ కూలీలకు భూములు పంచడంలో జరుపబడుచున్న ఆలస్యమును గురించి చర్చించుటకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

బంచరాయి భూముల విషయంలోను, లావునీ భూముల విషయంలో ప్రజానుకూల నిర్ణయములు తీసుకొనడంలో ప్రభుత్వ విఫలతను గురించి చర్చించుటకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

అనావృష్టి. అతివృష్టి వల్ల నష్టపడిన రైతులకు భూమిశిస్తును ఇతర పన్నులను మాఫీ చేయడంలో ప్రభుత్వం విఫలత చెందినందులకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. I00

తెలంగాణా ప్రాంతములోగల భూమిశిస్తు భారాన్ని తగ్గించడంలో ప్రభుత్వ అసమర్థతను గురించి చర్చించుటకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

రెవెన్యూ డిపార్టుమెంటు వారు భూసంస్కరణకు సంబంధించిన మరియు ఇతర కేసుల పరిష్కారములలో జరుపుచున్న జాగును గురించి చర్చించుటకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

ఆఫీసర్లులేని ఆఫీసుల సంఖ్య పెంచబడుతున్నందుకు, డెప్యూటీ కలెక్టర్ లేకుండా కొత్తగూడెం డివిజన్‌లోను ఇతరత్రా వ్యవహారాలు పరిష్కారం జరుగుచున్న ఇబ్బందులను వివరించుటకు.

To reduce the allotment of Rs. 1,62,11,000 for Land Revenue by Rs. 100

తెలంగాణా గ్రామోద్యోగుల పనిభారాన్ని పెంచుతున్నందుకు, భృతికి సరిపోను వేతనాలు నిర్ణయింప నందుకు.

*Mr. Speaker* : Motions moved.

*Demand No. XII–District Administration Rs.3,27,34,000*

*Sri Vavilala Gopalakrishnayya* : I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000/- for District Administration by Rs. 100

జిల్లా పరిపాలనా బాధలో అంతా అన్ని శాఖలపైనను జిల్లా కౌన్సిల్సును ఋస్తూ సరాసరి ఎన్నుకోబడినా జిల్లా కౌన్సిళ్ళను నిర్మాణం చేయవలెనని వచ్చ జెప్పుటకు.

To reduce the allotment of Rs. 3,27,34,000/- for District Administration by Rs. 100

జిల్లాస్థాయిలో గ్రామస్థాయిలో పరిపాలనా అంతా ప్రజలచే సరాసరి ఎన్నుకోబడిన కౌన్సిల్సు ద్వారా నడప ప్రయత్నించనందుకు నిరసనగా.

*Mr. Speaker :* Motions moved.

*Sri K. Muthiam Reddy*: I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

జిల్లా అధికారులు లంచగొండితనము, సోమరితనము మానక తమ పనులను సరిగా నెరవేర్చనందులకు.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

నిర్మల తహసీలులో–27,000–తగల్లులకు కారకులయినందులకు.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

ఆదిలాబాదు జిల్లా కలెక్టరు సమయానుకూలముగ పని చేయక బీదరైతుల పట్ల కిర్యాయిలు పూర్తి చేయనందులకు.

*Mr. Speaker*: Motions moved:

*Sri S. Ranganadha Mudaliar*: I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

For not providing for the increase of the salary of Assistant Public Prosecutors in the District.

*Mr. Speaker*: Motion moved.

*Sri Baswa Maniah*: I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

హైదరాబాదు ప్రభుత్వములో జిల్లాకార్యాలయమునందు ప్రతి పెటిషన్‌కు రశీదు యిచ్చు విధానమును మార్చినందులకు ప్రభుత్వ పాలసీని విమర్శించ గలందులకు.

*Mr. Speaker* : Motion moved.

*Sri Pillalamarri Venkateswarlu*: I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government to extend the Rs. 6/– extra pay granted to the services working in Hyderabad-Secunderabad Cities, to those who are employed in the Muffasil areas as well.

To reduce the allotment of Rs 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government to re-organise the District Administration by regrouping the districts so as to reduce the population and area of the existing ones whenever they are found unwieldly and also to reduce the control of the Collector over various Departments in the Districts.

*Mr. Speaker*: Motions moved.

*Sri K.L. Narasimha Rao*: I beg to move:

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

పొదుపు ఉద్యమం వసూళ్ళ కార్యక్రమంలో బలవంతంగా వసూళ్ళకు పూనుకోవటంను గురించి.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

పొదుపు ఉద్యమంలో పెట్టుబడి పెట్టలేదని తిరువూరు తాలూకాలో రైతులపై చెరువులలోనుండి మట్టి తీశారనే నెపంతో కేసులను పెట్టుట గురించి.

*Mr. Speaker:* Motions moved;

*Sri K. Rajamallu* : I beg to move.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs 100

To discuss the corruption and mal-practices in District administration.

*Mr. Speaker* : Motion moved.

*Sri S. V. K. Prasad* : I beg to move.

To reduce the allotment of Rs. 3,27,34,000/- for District Administration and Miscellaneous by Rs. 100

అధికారులకు ప్రజలు పెటీషనులు ద్వారా తెలుపుకొన్న విషయాలను గురించి త్వరలో పరిష్కరించే పద్ధతి అనుసరించనందులకు.

To reduce the allotment of Rs 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs 100

అధికారంలో ఉన్న పార్టీవారు మంత్రులతో తమకున్న సంబంధాలను ఉపయోగించి జిల్లా, తాలూకా అధికారులు తమ కనుకూలంగా పనిచేయునట్లు చేయటం, అట్లు చేయనిచో ట్రాన్సుఫర్ మొదలగునవి చేయించే పద్ధతిని విమర్శించుటకు,

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

జిల్లా, తాలూకా పరిపాలనా యంత్రంలో నేడున్న అవినీతిని అరికట్టుటకై ఎట్టి చర్యలనూ ప్రభుత్వం తీసుకోనందులకై విమర్శించుట.

*Mr. Speaker* : Motions moved.

*Sri S. V. K. Prasad* : I beg to move.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government in not checking corruption, Red-tapism etc. in District Administration.

*Mr. Speaker* : Motion moved.

*Sri Krishnamachari*: I beg to move.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

జిల్లాలలో ప్రభుత్వ వ్యవహారములన్నియు తెలుగు భాషలో జరుపుటకై ప్రయత్నించ నందున.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

జిల్లా పరిపాలనలో జరుగుచున్న లోపములను గురించి విమర్శించుటకు.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs 100

డిప్యూటీ కలెక్టర్లకు క్రిమినల్ ప్రోసీజరు కోడుకు సంబంధించిన కొన్ని సెక్షన్లు అధికారమిచ్చినందుకు జరుగుచున్న ఆలస్యమును గురించి,

*Mr. Speaker*: Motions moved

*Sri B. Sriramamurthy* : I beg to move

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government to constitute a Pay Commission to go into the question of service conditions and scales of pay of non-gazetted officials and low grade employees.

To reduce the allotment of Rs 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government to re-organise the structure of Administration to suit the needs of democracy and decentralisation and to allocate 1/4 of the land revenue to the village panchayats.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To Discuss the failure of the Government to appoint a high power Administrative Enquiry Committee to go into the question of integration of services in Telangana and Andhra areas.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Micellaneous by Rs. 100

To discuss the failure of the Government to bring the scales of pay between the highest and lowest paid employees within the ratio of 1 : 10

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by Rs. 100

To discuss the failure of the Government to abolish the post of the District Collectors and entrust the admi-

nistration and the District level to the duly elected representatives of the people.

To reduce the allotment of Rs. 3,27,34,000 for District Administration and Miscellaneous by .. Rs. 100

To discuss the failure of the Government to Abolish the post of the District Collectors and entrust the administration at the District level to the duly elected representatives of the people.

*Mr. Speaker* . Motions moved

*Demand No. XXX–Famine* *Rs. 74,26,300*

*Sri Vavilala Gopalakrishnayya* ; I beg to move:

To reduce the allotment of Rs. 74,20,300 for Famine by Rs. 100

To discuss the policy.

*Mr. Speaker* : Motion moved

*Sri Baswa Mniah* : I beg to moved:

To reduce the allotment of Rs. 74,20,300 for Famine by Rs. 100

ఆంధోలు తాలూకాలో శంకరంపేట, గ్రామమున తిండికి ధాన్యం చౌక దుకాణం నెలకొల్ప మన్నను ప్రభుత్వం ఏంచేయని విధానం విమర్శించ గలందులకు.

*Mr.Speaker*: Motion moved

*Sri K. L. Narasimha Rao*: I beg to move:

To reduce the allotment of Rs. 74,20,300 for Famine by Rs. 100

To discuss the inadequate measures taken by the Governmant in certain parts of the State where the crops have almost failed and famine conditions prevailed.

*Mr. Speaker* : Motion moved

*Sri D. Narsciah* : I beg to move:

To reduce the allotment of Rs. 74,20,300 for Famine by Rs. 100

నల్లగొండ జిల్లాలో యీ సంవత్సరం పంటలు పోయి వర్షాలు తక్కువగా కురిసి నందున కరువు పరిస్థితులు ఏర్పడ్డ విషయాన్ని ప్రభుత్వం గుర్తించనందులకు.

*Mr. Speaker*: Motion moved

*Demand No. XXXVIII–Compensation to Zamindars Rs. 18,75,000*

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 18,75,000 for Compensation to Zamindars by Rs. 100

To discuss the policy.

*Mr. Speaker*: Motion moved.

*Sri K. L. Narasimha Rao*: I beg to move:

To reduce the allotment of Rs. 18,75,000 for Compensation to Zamindars by Rs. 100

To discuss the problem of postponing the compensation to Zamindars for a period of 20 years.

*Mr. Speaker*: Motion moved.

ఈ రోజున చర్చకు గంటన్నర అవకాశము ఉన్నది. రేపు 9–30 గం॥ నుంచి 1–30 గం॥ వరకు 4 గం॥ చర్చించుకొనవచ్చును. ఇప్పుడు బి. శ్రీరామ మూర్తిగారు ప్రతిపక్షంనుంచి మాట్లాడుతారు. వారికి 20 నిమిషములు, మిగతా వారికి 10 నిమిషములు టైము ఇవ్వబడును.

* శ్రీ బి. శ్రీరామమూర్తి :– అధ్యక్షా ! ఇప్పుడు యే చట్టాన్ని ప్యాసు చేసినప్పటికి, యే నిర్ణయం చేసినప్పటికీ, అమలు జరిపేది డిపార్టుమెంటు. ఆడిపార్టు మెంటల్ మెషినరీ స్ట్రక్చర్ పూర్వం యెప్పుడో, బ్రిటిష్‌వారు ప్రవేశ పెట్టినదే తప్ప దానిలో ఒక్కమార్పుకూడా చేయలేదు. స్వాతంత్ర్యంవచ్చి పది సంవత్సరము లయినా మనం యింకా పాత పద్ధతులను వదలుటలేదు. ఈ పద్ధతిఅంతా red-tapism తో కూడుకొన్నది. ఏ పని జరగాలన్నా సంవత్సరాలు పడుతోంది. Decentralisation, డెమోక్రెసీ కావాలంటున్న మనం, ఆ ఆశయ సాధనకు అను కూలమైన మార్పులు ప్రభుత్వవ్యవస్థలో తీసుకొని వచ్చుట అవసరమని మనవి చేస్తున్నాను. రెవిన్యూబోర్డును రద్దుచేయమని అనేక సందర్భాలలో ప్రతిపక్ష సభ్యు లందరూ చెప్పారు. దానిగురించి ప్రభుత్వం యేమీ ఆలోచించలేదు. పూర్వం కాశీకి పోయినా, కాటికిపోయిన ఒక్కటే అనేవారు. ఆ విధంగానే రెవిన్యూ డిపార్టు మెంటుకు దరఖాస్తు యేదైనా పెడితే – బుట్టదాఖలు అయినదనే అర్థం. ఈ నాడు రెవిన్యూ డిపార్టుమెంటులో stumbling block అనేది ఉన్నది. అందువల్లనే దానిని రద్దుచేయమంటున్నాం. అట్లా రద్దుచేయడానికి ప్రభుత్వానికి వీలుకాకపోతే ఆ రెవిన్యూ

బోర్డు చేసే పనులలో మార్పులైనా తీసుకుని రావాలి. కొన్ని దేశాలలో ఈ రెవిన్యూ బోర్డును Finance Department కు attach చేయబడి ఉన్నది. అట్లా ఉన్నట్లయితే, దేశంలో ప్రజలకు Taxable capacity యెంత ఉన్నది. మొదలైన విషయాలు, యీ బోర్డు సూచించవచ్చు. Taxation Policy మీద, అప్పీళ్లు విచారించుట మొదలైనవి చేయవచ్చు. ఆవిధంగా దాని ప్రస్తుత కార్య క్రమాలను మార్చాలనీ మరొకసారి విన్నవిస్తున్నాను. ఆప్రకారము Revenue Board ను Finance Department కు attach చేస్తే బాగుంటుంది. బోర్డు తప్ప కుండా ఉండాలని అంటారా, రెవెన్యూ డిపార్టుమెంటును రద్దుచేయండి, ఎదో ఒక్కటే ఉన్నట్లయితే బాగుంటుంది. ఈ రెండు ఉన్నందువల్ల duplication of work అయి అనవసర ఆలస్యం అవుతున్నది. ఇప్పుడు రెవిన్యూబోర్డు "dustbin of residuary Governmental functions" క్రింద కనబడుతోంది.

ఉదాహరణగా Revenue Board లోని Survey and Settlementవిభాగాన్ని తీసుకుందాము. ఈ Survey and Settlement operations అన్నీ Agricultural Department కు ఇవ్వవచ్చు. పన్నులు వసూలు చేసేపూచీ Revenue Board మీదవుంది. దీనిని మనం గ్రామ పంచాయతీలకు అప్పగించవచ్చు. అలా చేసిన రోజున పరిమైనటువంటి, న్యాయమైనటువంటి పద్ధతిలో పన్నుల వసూళ్ళు జరుగు తాయి. ఈవిధంగా చేసిన రోజున co-ordinative functions మాత్రం Revenue Board కు మిగులుతాయి. వీటిని ముఖ్యమంత్రిగారి క్రింద ఉన్న General Administration Department కు ఒప్పగించడానికి అవకాశం ఉంటుంది. ఈరకంగా Revenue Board functions అన్నీ ఆయా branches కు ఇచ్చి దీనిని రద్దుచేస్తే దేశంలో మనం కావాలను కొంటున్న economy ఉంటుంది. ఇప్పుడు దానిని గురించి ఏమీ మాట్లాడరు. బ్రహ్మానందరెడ్డిగారి కమిటీ బ్రహ్మానందంగా, చిదా నందంగా వున్నట్లు కనిపిస్తుంది. ఆ కమిటీ ఎక్కడ ఉందో బ్రహ్మకే తెలుసు.

District Administration గురించి ఒక్క విషయం చెబుతాను. కాంపేక్టు మరియు హోమోజినస్ ఏరియాలు ప్రస్తుత జిల్లాలలోలేవు. అన్‌వీల్డీగా ఉన్న జిల్లాలు అనేకం ఉన్నాయి. అందుచేత జిల్లాపరిహద్దులను ప్రభుత్వం తిరిగి మార్పుచేయాలి. ఆవిధంగా చేసిన రోజున అనుకూలమైన పరిపాలన జరగడానికి అవకాశం ఉంటుంది. అంతేకాదు రాష్ట్రస్థాయిలో ప్రజాప్రతినిధుల ప్రభుత్వం ఉంచేసరిపోదు. జిల్లా level లో కూడా ప్రజలద్వారా ఎన్నికైన ప్రతినిధుల పరిపాలన కొనసాగాలని మా పార్టీయొక్క విస్పష్ట అభిప్రాయం. ప్రజలకు కావలసిన పనులు జిల్లాస్థాయి లోనే ఉంటాయి. అక్కడ బ్యూరోక్రసీ ఉంచే ప్రజలు ఏమి అవుతారో ఆలో చించండి. అందుచేతనే సోషలిష్టుపార్టీ Four Pillars State కావాలంటోంది. దీనివల్ల

గ్రామాల్లో పంచాయితీలు, జిల్లాల్లో జిల్లా కౌన్సిల్సు ఏర్పడి ప్రజాప్రతినిధుల ద్వారా పరిపాలన జరుగుతుంది. అదే విధంగా రాష్ట్రకేంద్ర స్థాయిల్లోను సాగుతుంది. జిల్లా council కు కలెక్టర్ ఉద్యోగం ఉండకూడదని మా అభిప్రాయం. ఒక అధికారిచేతుల్లో జిల్లా పరిపాలన ఉండకూడదు. ఒకవేళ ఉండాలనుకొంటే గ్రామ పంచాయితీలలో ఏవిధంగా executive officers ఉన్నారో, అదే విధంగా కలెక్టర్‌ను వుంచవచ్చు. Planning money మరియు పన్నులవల్ల వసూలైన మొత్తంలో నాలుగవ వంతు జిల్లాలోనే వుంచాలి. విద్య, police లపై పెత్తనం జిల్లా కౌన్సిల్‌కే వుండాలి. ఈరకంగా చేస్తే ప్రస్తుతం పోలీసులు ప్రజలపై కాల్పులు జరిపే పరిస్థితి అరికట్టబడుతుంది. దేశంలో శాంతి భద్రతలు ఏర్పడుతాయి. ఆవిధంగా చేసిననాడు వికేంద్రీకరణ విధానం, ప్రజాస్వామిక పద్ధతిలో, స్వయం సంపూర్ణమైన పరిపాలన రాజ్యాంగ బద్ధంగా ఏర్పడుతుంది. ఇది మా పార్టీయొక్క స్పష్టమైన విధానం.

N. G. Os. జీతాలు పెంచాలని ఆందోళన చేస్తున్నారు. దానిని గురించి విచారణ చేయడానికి ఒక Pay Commission ను వేయాలి. వీరి జీతాలు పెంచడానికి ప్రజలపైన అదనపు పన్నులు వేయవలసి వుంటుందని ముఖ్యమంత్రిగారు ప్రకటించారు. ఇది దూరదృష్టిలేని ప్రకటన.

శ్రీ కె. వెంకట్రావు :- ముఖ్యమంత్రిగారు ఇప్పుడు ఇక్కడ లేరు ఆ రోజున మాట్లాడారు కదా ? మళ్ళీ ఆ విషయము ఎందుకు తీసుకు వస్తారు ?

శ్రీ బి. శ్రీరామమూర్తి :- సంతృప్తిచెందిన Services ఉండటం మంచిది. ఈ ఉద్యోగుల promotions విషయంలో చాలా పొరపాట్లు జరుగుతున్నాయి. శాసన సభ్యులమైన మేము ఈ విషయంలో ఏమీ చేయలేకుండాఉన్నాము. అందుచేత Civil Services తాలూకు విషయాలన్నీ కూడా govern చేస్తూ ఒక Act శాసన సభలోనే pass కావాలి.

Integration of laws పేరుతో తెలంగాణాపైన అధికంగా పన్నులు వేయబడుతున్నాయి. ఆంధ్రలో ఎక్కువ వున్న పన్నులన్నిటిని ఈ విధంగా Telangana పైన వేస్తున్నప్పుడు, అక్కడ తక్కువ వున్న పన్నులు కూడా ఇక్కడ ఎందుకు అమలు చేయరు ?

శ్రీ కె. వెంకట్రావు :- నేను పెట్టిన 144 శాసనాలలో పన్నులకు సంబంధించినది ఒక్కటి కూడా లేదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి :- అది ఆలోచనలో లేనందుకు చాలా సంతోషం. తెల్లంగాణాల్లోని ప్యూడల్‌లాస్ ఫోత్తే సీఖ ఫిఖాఖఘ్నోంధ్లుకని, నన్ను ఒకమిత్రుడు

అడిగాడు. అదే విధంగా అనుకొంటే మన ఆంధ్రలోని laws అన్నీ East India Company వారి laws అన్నమాటే. ఏ laws అయినా వాటిలోని మంచిని మనం తీసుకొని ప్రజాక్షేమానికి సరైన, సమగ్రమైన శాసనాలు ప్రవేశ పెట్టుకోవాలి.

Tax structure గురించి విచారణ చేయడానికి ఒక కమిటీని వేస్తున్నట్లు మంత్రిగారు చెప్పారు. Profitless agriculture మీద పన్ను వేయరాదని మా అభిప్రాయం. He who cannot live for himself, cannot also pay for others Karachi Congress లో uneconomic holdings పై పన్నులువుండరాదని తీర్మానం చేశారు. వాటిని exempt చెయ్యమన్న పరిస్థితులు కూడా ఉన్నాయి. ఆంధ్రలో రు. 10 ల లోపు శిస్తు రద్దు చేస్తాం అంటే, అది uneconomic holdings ను exempt చేయడానికి దారితీస్తుందని నేను సంతోషించాను.సంతోషిద్దామన్నా ప్రభుత్వం సంతోషించకుండా, దానినిcancel చేసింది. Un-economic holdings మీద ప్రభుత్వం పన్నును తప్పకుండా exempt చేయాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఆ రకంగా తగ్గిస్తే ప్రభుత్వ ఆదాయం తగ్గిపోతుందని అంటారు. కేవలం పన్నులమీదే ఆధారపడి ప్రభుత్వం నడుస్తోందంటే నేను నమ్మలేను. ఆరకమైన అభిప్రాయం కలవారు ఎవరైనా వుంటే వారు తోడర్‌మల్లు యుగానికి చెందిన మనుష్యులై వుంటారని నేను భావిస్తున్నాను. ప్రభుత్వానికి ఇతరత్రా sources of income పెరిగిన తరువాత, పేదలపై పన్ను ఎందుకు వేయాలని అడుగుతున్నాను. ఇట్లా వేయడం సరైన విధానం కాదని నేను మనవి చేస్తున్నాను.

ఈ పన్నులను వసూలు చేయడానికి ఎంత ఖర్చు అవుతుందో ఆలోచించండి. ఈ land revenue వసూలు చెయ్యడానికి ప్రభుత్వానికి సామాన్యంగా వచ్చిన పన్నులలో సగము భాగమైన ఖర్చు అవుతున్నది. అందుచేత profitless agriculture మీద పన్ను రద్దుచెయ్యాలని మనవి చేస్తున్నాను.

Land reforms విషయంలో రెవెన్యూ మంత్రిగారు వేసిన ప్రశ్నలు చూస్తే చాల వింతగా కనబడుతున్నాయి. ఉదాహరణకు వారు అడిగినవి, రైతులు భూముల మంచి బేదఖల్ చెయ్యవచ్చునా? "భూస్వామి, తన భూమిని అమ్ముకోవచ్చునా?" వంటి ప్రశ్నలు ఈరోజు తిరిగి మీ ఎదుటనే పెట్టి వాటికి జవాబులు ఇవ్వమంటున్నారు.

శ్రీ కె. వెంకటరావు :— ఇంతవరకు దానిని గురించి మన రాష్ట్రంలో శాసనము లేదుగనుక కొన్ని facts తెలుసుకొనే విషయమై సలహాను కోరితే దానిని గురించి వారు అంత బాధ పడుతున్నారెందుకు?

శ్రీ బి. శ్రీరామమూర్తి :- వారు అడగడం బాగానే ఉన్నది. ఒక ప్రక్కనుంచి, భూసంస్కరణలు అన్నీ సిద్ధమయ్యాయి, వచ్చే శాసన సభలో ప్రవేశ పెట్టడానికి నేను తయారుగా ఉన్నాను అని చెబుతూ రెండవ ప్రక్కనుంచి అది సిద్ధంగాలేదు కాబట్టి దానిమీద మా సూచనలు ఇవ్వండి" అంటే ఎందుకు ఇవ్వాలి. ఈ సూచనలు" అని అడుగుతున్నాను. మీ సూచనలను తీసుకొన్న తరువాత చట్టాన్ని తయారుచేసే అభిప్రాయము ప్రభుత్వానికి ఉన్నట్లైతే మేము సూచనలు ఇవ్వడంలో సబబు ఉంటుంది. వారు కోరడం కూడ సబబుగానే ఉంటుంది. ఒక ప్రక్క చట్టము తయారైనదని చెబుతూ రెండవప్రక్క సూచనలుకావాలి అనడంలో అర్థము ఏమిలేదు. ఇది అంతా చూస్తే దీనిని వదలిపెట్టే ప్రయత్నంగా తోస్తున్నది.

ఈ విషయంలో మా తాలూకు అభిప్రాయాలన్నీ ఏనాడో స్పష్టంగా చెప్పి వేశాము. కాని వారు మాత్రము భూసంస్కరణలు పేరుతో కాలయాపన చేస్తూ ఉన్నారు. ఆ కారణంగా భూస్వాములు అందరూ కూడ, అధికంగా ఉన్న భూమిని, వారి తాలూకు చుట్టాలు, బంధువులు పేర్లపై తనభూములను మార్పించుకోవడానికి అవకాశాన్ని కల్పిస్తున్నారు. ఈ సంస్కరణల విషయంలో ప్రభుత్వము ఈవిధంగా సీతకన్నువేస్తున్నదని స్పష్టంగా తెలిసిపోతున్నది. Drastic Land reforms కావాలని మేము మొదటినుంచీ కోరుతూనే ఉన్నాము. కావున కొన్ని ప్రశ్నలు మా మొఖంమీద గిరవాటువేసి "కాలక్షేపం చెయ్యండి," అని అంటే సంతృప్తిపడే వారు లేరు. ఆ ప్రశ్నలకు జవాబులుచెప్పినా ప్రయోజనం లేదని మనవిచేస్తున్నాను. భూమికమతాలకు maximum limit పెట్టాలి. Economic holding నిర్ణయించాలి. $2\frac{1}{2}$ రెట్లకు మించకుండా, maximum holding నిర్ణయించాలి. వ్యవసాయానికి మించినటువంటి ఇతర ఆదాయాలు ఏరకంగా ఉన్నాయి! అనే ప్రశ్నతో ఈ వ్యవసాయాన్ని ముడిపెట్టరాదు. వ్యవసాయంలో "Law of diminishing returns" operate అవుతున్నది. Industries లో "Law of increasing returns" operate అవుతున్నది. వ్యవసాయంలో pressure of population ఎక్కువగా ఉన్నది. వ్యవసాయము తప్ప ఇంకొక వృత్తిలేదు. అటువంటప్పుడు భూమిమీద విత్తనం ఏ కొద్దిమంది చేతులలోనో పెట్టితే ఆ కొద్దిమంది పాదాలక్రింద బానిసలుగా బ్రతకమనే అర్థమవుతుంది.

అందుచేత ఎంతకొద్ది భూమిని అయినా నాదిఅని చెప్పుకోనే భూవసతిని ప్రతి ఒక్కరికి కల్పించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

Village officers కు, ఒక్కొక్కరికి, 5/- రూ. 3/-, 2/- రూపాయలు, ఈ రకంగా జీతాలు పెంచామని చెప్పారు, దానికి చాల సంతోషించాము. కాని వారి

తాలూకా కోర్కెలను ఎంతవరకు తీర్చగలిగారంటే, ఏమీ తీర్చలేదనే స్పష్టంగా కనబడుతున్నది. వాళ్ల కోర్కెలపైన ఆలోచన చేస్తూనే ఉన్నామని ఎప్పటికప్పుడు కాలక్షేపణ చేస్తున్నారు. కావున దీనిమీద స్పష్టమైన అభిప్రాయము, ప్రభుత్వము కొంతకాలములోనే తెలియపరచాలని విజ్ఞప్తి చేస్తున్నాను. అంతేకాకుండ, ఆయా ప్రాంతాలలో Survey and Settlement జరిగేపర్యంతం, అక్కడఉన్న గ్రామ ఉద్యోగస్థుల జీతాలుపెంచే విషయంలో ఏ విధమైన సూచనలు చెయ్యలేమని ఆ రిపోర్టులో ఉన్నది. అదే నిజమైతే Survey and Settlement అయిన తరువాత, వాళ్లకు ఎంతజీతమైతే పెంచదలచుకొన్నారో, అదిఅంతా retrospective effect తో సహాయిస్తామని, కనీసం ఒక హామీని అయినా యివ్వాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఆ రిపోర్టులో "wherever the village officers continued their agitation, it may be necessary to replace them by Lower Division Clerks etc. వున్నది.

వాళ్లు ఎటువంటి ఆందోళన చేసినా మరు క్షణంనుంచి clerks చేత replace చేస్తామని ఈ report లో ఉండడము ఆశ్చర్యంగా ఉన్నది. ఈలాంటి ప్రవర్తన, కేవలం నిరంకుశ విధానానికి తార్కాణం అవుతుందని చెప్పక తప్పదు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యము యివన్నీ కేవలం మాటలకే తప్ప, నిజానికి అది అమలులో వుండదని, ఋజువుపరుస్తున్నట్లు అవుతుందని మనవిచేస్తున్నాను.

ఇక రైతులకు అనేక ప్రాంతాలలో అప్పులు ఇవ్వడం జరుగుతున్నది. వారు సకాలంలో చెల్లించలేనప్పుడు ప్రతి 10/- రూపాయలకు రోజు ఒకటికి ఒక "అణా" penal interest వసూలు చేస్తూ ఉన్నారు. ఇది ఏమాత్రం న్యాయంకాదు. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించి సంతవరకు "Telco" అనే company కి కొన్ని లక్షల రూపాయలు అప్పుగా ఇస్తున్నారు. వారుకూడ సకాలంలో చెల్లించక పోతే, interest వసూలు చెయ్యకుండా వదిలేసి, చిన్నరైతుల వద్దనుంచి 10/ రూపాయలకు ఒక "అణా" చొప్పున పీనల్ వడ్డీ వెయ్యడం న్యాయమా అనే విషయం ఆలోచించాలని కోరుతున్నాను.

శ్రీకాకుళం జిల్లాలో చీపురుపల్లి వంటి తాలూకాలలో పంటపోయి నప్పటికీ ప్రభుత్వము, వారికి సకాలంలో రెమిషన్ ఇవ్వడం లేదు. నీటి తీరువకు మాత్రము "రెమిషన్" ఇస్తూ ఉన్నారు. అసలు పన్నుకు కూడా "రెమిషన్" ఇవ్వాలని కోరుతున్నాను.

పోరంబోకు భూములను assign చెయ్యాలని ఎంతోకాలంనుంచి కోరుతుంటే అవి పోరంబోకులు కావున assign చెయ్యము అంటారు. కాని కొంతమంది దానిని

సాగుచేసి దున్నుకుంటే వారిదగ్గరనుంచి penal cess వసూలు చేస్తూ ఉన్నారు. అందుచేత వాటిని కూడ తప్పనిసరిగా assign చెయ్యాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

అంతే కాకుండ, జమీందారీల రద్దు జరిగిన తరువాత విజయనగరం ప్రాంతంలో estate employees చాలా మంది ఉండిపోయారు. వారిని ప్రభుత్వ departments లోనికి తీసుకున్నారు. కాని కొంతమంది మాత్రం ఉద్యోగంలేక ఉండిపోవలసి వచ్చింది. కాని ఉద్యోగాలలో ఉన్నవారికైనా సరియైన increments, scales of pay, సెలవలు ఇతర సౌకర్యాలు ఏమీ వారికి ఇవ్వడంలేదు. ఈ విషయం గురించి ఆలోచించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇంకొక విషయం. ఈ Estate Abolition Act లో 55 (1) (b) Section ప్రకారంగా 1956-57 Fasali తాలూకు డబ్బుకట్టే ప్రతిరైతుకు, అంతకు ముందు సంవత్సరంలో తాను ఎంత బకాయి ఉన్నప్పటికీ మాఫీచేస్తామనే ప్రభుత్వం చెప్పింది. 1956-57 Fasali డబ్బు చెల్లిస్తేచాలు అన్నారు. కాని, విజయనగరం సంస్థానంలో చాలా ప్రాంతాలలో 1956-57 Fasali డబ్బు కట్టినవారి వద్దనుంచి పాతబాకీ గూడ వసూలు చేస్తూ వున్నారు. వడ్డీతోసహా కట్టమంటున్నారు. కొంత మందికి 7,8 సంవత్సరాల బకాయిలు ఉన్నాయి. ఆ ప్రకారము పాత బకాయిలు వడ్డీతో చెల్లించాలని ప్రభుత్వం ముందుగా ఎందుకు చెప్పలేదు? వెంటనే వసూలుచేసి వుంటే ఆ వడ్డీ అయినా వారికి తప్పేది గదా: కావున యీ విషయాలన్నీ తగు శ్రద్ధతో పరిశీలించి పరిష్కార మార్గాన్ని ఆలోచించాలని ప్రభుత్వానికి మనవిచేస్తూ ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ పి. వి. రాజేశ్వరరావు (సిద్ధిపేట) :- అధ్యక్షా, శ్రీ కళా వెంకటరావుగారు ప్రతిపాదించిన యీ డిమాండును నేను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను. ఈ సందర్భంలో కొన్ని సూచనలు వారికి మనవి చేయదలచుకున్నాను. వారు తెలంగాణా ప్రాంతములోని తక్కావీ అప్పులను గురించి realistic view తీసుకుని ఒక నిర్ణయం చేశారు. అందుకు వారికి తమద్వారా ధన్యవాదాలు తెలియపరచుచున్నాను. కాని యీ తక్కావీ అప్పుల విషయంలో 100 రూపాయలు మట్టుకు పన్ను వున్న పట్టాదారులకే యీ వసతులు కలుగుతాయని G. O. జారీ చేశారు. కాని ఇక్కడ బినామీ పట్టాదారులున్నారు. ఒకే పట్టామీద ఎంతోమంది షిక్మీదార్లు, ఎంతోమంది హిస్సేదార్లు ఉన్నారు. వారికి యీ సదుపాయాలు అందుబాటులో లేవు. పట్టాలు చాలమట్టుకు బినామిగా వుండడం actual possession ఎవరికో వుండడం తెలంగాణాలో చాలామట్టుకు అమలులో వుంది. దీనిని సరి

దిద్దాలని నేను వారిని కోరుతున్నాను, తెలంగాణా గ్రామసీమలలో పటేల్ పట్వారీల వల్ల వతన్‌దారుల వల్ల రైతాంగానికి చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. ఇంతకు ముందు హైదరాబాదు ప్రభుత్వం వున్నరోజులలో వతన్‌దారీ విధానం రద్దుచేస్తామని చెబుతూ వచ్చారేగాని చెయ్యలేదు. ఈ వతన్‌దారీ విధానంలో లంచగొండితనం వల్ల పల్లెసీమలలో రైతాంగం చాలా బాధలు పడుతున్నారు. ఒక వతన్‌దారుకు 20 గ్రామా లుండడంవల్ల స్వయంగా కాక గుమాస్తాను పెట్టి తతంగం నడిపిస్తున్న విషయం మనకందరకు తెలిసినదే. ఈ వతన్‌దారి విధానం రద్దుచేసి సక్రమంగా పనిచేసే వారికి సరైన వేతనం దొరికే టట్లు చూడాలి. ఈ మధ్యనే ఆంధ్రప్రాంతానికి ఒక కమిటీని వేసి గ్రామ కరణాలకు వేతనాలు హెచ్చింపు చేయడం జరిగింది. కాని తెలంగాణా ప్రాంతానికి మాత్రం అట్టి కమిటీని నియమించలేదు. ఇక్కడ గ్రామోద్యోగులకు యేమి సాధక బాధకాలున్నాయో చూసినవారు లేరు. అదికూడా చూడవలసిన అవసరం వుంది. గ్రామసీమలలో లంచగొండి తనం అరికట్టాలంటే ఈ గ్రామోద్యోగులకు సరైన వేతనాలివ్వాలి. వారికి T.A. ఇవ్వాలి; D.A. ఇవ్వాలి ఇక్కడి మస్కూరీలకు మూడు రూపాయలు వేతనం దొరుకుతుంది. అది చాలా అన్యాయమైన వేతనం. మస్కూరీలకు, తలారీలకు, నీరుడీలకు వేతనం ఎక్కువయేటట్లు చూడాలి. గ్రామాలలో అన్యాయం చేయకుండా పటేల్ పట్వారీలు సక్రమంగా పరిపాలన చేసి రైతాంగానికి ఉపకరించే పనులు చేసేటట్లు చూడాలి. రెవిన్యూ ఆర్డర్లను గ్రామాధికారులు దుర్వినియోగం చేసుకోవడం, లంచాలు పుచ్చుకోడంవల్ల ప్రభుత్వానికి చెడ్డపేరు వస్తుంది. కాబట్టి ఆలస్యం చేయకుండా యీ విషయాన్ని తొందరగా పరిష్కరం చేయాలని కోరుతున్నాను. గ్రామాలలో పటేల్‌పట్వారీలకు కాగజ్‌బహా సరిగా యివ్వడంలేదు. దానికోసం ప్రజలనుండి డబ్బు వసూలు చేస్తారు. మాల్గుజారీలు వసూలు చేసేటప్పుడు..... ...

శ్రీ కె. వెంకటరావు:- వీలయినంత వరకు ఉర్దూపదాలు తక్కువ ఉపయోగించమనండి.

శ్రీ పి.వి. రాజేశ్వరరావు:- మాల్గుజారీల సాదర్‌సీర చాలడబ్బు అవుతుంది. సాదర్ అంటే పటేల్ పట్వారీలు. రైతుల మొఖరరా మాల్గుజారీలలోవున్నదానికన్న ఎక్కువ వసూలు చేసి వారిని పీడించిన ఉదంతములు చాలావరకు వింటున్నాము. పీటిని అరికట్టడానికి పటేల్ పట్వారీల సాధక బాధకాలు విచారించి, వారి వేతనాలు ఎక్కువచేసి సక్రమంగా వారు పని చేసేటట్లు చూడాలి. ఒక పట్వారీకి రెండు గ్రామాలకన్నా ఎక్కువ వుండరాదనీ, 10-20 గ్రామాల monopoly చేయడం మంచిది కాదనీ సూచిస్తున్నాను. తైబందీ వుంది. తాబీ కాలంలో చెరువులోని నీరు

ఎవరికి ఎంతపోవాలో నిర్ణయం చేసేటప్పుడు పటేల్ పట్వారీలు గిర్దావరులు చాలా అన్యాయం చేస్తున్నారు. (Thaibandi) తైబందీ విషయంలో ఖానూన్ గాని గష్తీగాని సక్రమంగాలేదు. గ్రామాలలో పెత్తనం చెలాయించేవారు. పటేల్ పట్వారీలను అండగా పెట్టుకుని లాభంపొందుతున్నారు. చిన్న వ్యవసాయదారులు లాభంపొందలేక పోతున్నారు. అధికాహారోత్పత్తి అని అంటున్నాము. ఈ సంవత్సరం యీ చెరువులలో ఇన్నిఎకరాలకే నీరువుంటుంది అని సక్రమమైననిబంధనలు ఏర్పాటుచేయాలి. ఆంధ్ర ప్రదేశ్‌లో రివిన్యూజిల్లాలు అతిపెద్దవీ, అతిచిన్నవీ వున్నాయి. పరిపాలనలో ప్రతిజిల్లాకు ఖర్చవుతూవున్నదీ. గుంటూరు జిల్లా చాలాపెద్దది. ఖమ్మం జిల్లా చాలాచిన్నది. ఈ జిల్లాలను reorganize చేయాలని కోరుతున్నాను. ముఖ్యంగా మా జిల్లాగురించి మనవిచేయడం అవసరం. మెదక్ జిల్లా హైదరాబాదుకు అతిసమీపంలో వున్నది. ఏ నైజాము నవాబుకాలంలోనో ఆఫీసర్ల సౌకర్యంకొరకు సంగారెడ్డి జిల్లా headquarters పెట్టుకున్నారు. దీనివల్ల ప్రతిశలవునాడు ఆఫీసర్లు హైదరాబాదు రావడానికి వీలయిందేకాని జిల్లా పరిపాలన సక్రమంగా జరగడంలేదు. ప్రతిజిల్లాకు ఒక size ఏర్పాటుచేసి మళ్లా reorganize చేయవలెనని కోరుతున్నాను. ఇక్కడ రివిన్యూసమస్యలు చాలావున్నాయి. వీటిని గ్రహించి రాష్ట్రస్థాయిలో ఒక Revenue Advisory Committee ని హైదరాబాదు ప్రభుత్వంవారు వేసినారు. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత ఆ కమిటీని రద్దు పరచినారెమో నాకు తెలియదు. లావునీ భూములగురించి, రివిన్యూ ఆఫీసర్లుచేసే పనులగురించి ఆ కమిటీవారు కొన్ని సూచనలుచేశారు. ఆనాటినుంచి యీనాటి వరకు ఆ కమిటీ సమావేశపరచలేదు. ఆ కమిటి వున్నదో, ఎత్తివేయబడినదో తెలియదు. తెలంగాణా సభ్యులను ఆంధ్ర సభ్యులను కలిపి ఒక కమిటీనివేసి శాసనములను సమన్వయపరచడంలో గల సాధక బాధకములను గుర్తించాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్):— అధ్యక్షా, రెవెన్యూ డిమాండును ప్రవేశపెట్టుతూ మంత్రి శ్రీ కళా వెంకటరావుగారు చేసిన ఉపన్యాసము చాలాఆశాజనకముగావుంది. ఇంతకుముందు వ్యవసాయశాఖ మాత్యులుచేసిన ఉపన్యాసమునుబట్టి కొంత భయాందోళనలు కలిగిన దానినుంచి తేరుకొనడానికి అవకాశము లభించింది. భూసంస్కరణల విషయములో ఎవరి అభిప్రాయములు ఎలావున్నప్పటికినీ, గవర్నమెంటు అభిప్రాయము మంత్రిగారి ఉపన్యాసము ద్వారా అర్థమవుతుంది. ఈనాడు భూసంస్కరణలు కావాలని చాలామంది కోరుతున్నారు. భూసమస్యలు పరిష్కారమయితేగాని ఏ సమస్యలు పరిష్కారముకావని ఎన్నడో గాంధీజీ చెప్పివున్నారు. ఇదేవిధముగా మన ప్రభుత్వముకూడా భూసంస్కరణలను పరిష్కరించగలిగితే చాలా ఉపయోగము గలుగుతుంది. సరియైన పద్ధతిలో చేయుటక్కు

ఇంకాసభ్యులను సూచనలుచేయమని వారుఅడిగారు. ఏమైనామార్పు చేసుకోవలసిన అవసరమొచ్చినప్పుడు తగిన మార్పులుచేసి ప్రజలకు అనువుగా, ఎక్కువమందికి ఉపయోగపడేటట్లుగా భూసంస్కరణలు చేసినట్లయితే సంతోషించెదము. వచ్చే సమావేశంలోనే భూసంస్కరణలగురించి ప్రతిపాదన తీసుకొని రాగలమని హామీ యిచ్చినారు. దానికి వారిని అభినందిస్తున్నాను. మనం ఈనాడు ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రభుత్వమును నడుపుకొంటున్నాము. ప్రజాస్వామ్యములో అందరికీ వోటు హక్కువుంది. చాలమంది వోటు హక్కును స్వేచ్ఛగా వినియోగించుకోలేక పోతున్నారు. ఎందుకనగా వీరు భూస్వాముల దయాదాక్షిణ్యములమీద ఆధారపడి వుండడమే. వారు వారిహక్కును పూర్తిగా స్వేచ్ఛగా వినియోగించుకోలేక ఈ భూస్వాములు చెప్పినవారికే ఇవ్వడము జరుగుతున్నది. వారి యిష్టాన్ని వ్యక్తము చేసుకొనడానికి అవకాశంలేక పోతున్నది. భూసంస్కరణలు తీసుకొని రాగలిగితేనే సరియైన ప్రజాస్వామ్య ప్రభుత్వమని నమ్మేవారిలో నేనొకడానిని. ఇవిత్వరగా తీసుకొని రావాలని కోరుతున్నాను. వారు హామీయిచ్చారు. చాలాసంతోషము ప్రణాళిక బద్ధమైన అభివృద్ధిని మనము పొందుతున్నాము. భూములధరలు విపరీతముగా పెరిగిపోతున్నవి. అందరూ ఒకేవిధముగా లాభంపొందడములేదు. ఒకళ్లే ఎక్కువ లాభాన్ని పొందడము జరుగుతూవుంది. త్వరగా భూసంస్కరణలు అమలు జరిపిన compensation చెల్లించవలసిన అవసరం ఉండదు. లేకపోతే భూముల ధరలు విపరితముగా పెరుగును. ఎక్కువ compensation ఇవ్వ వలసి వుంటుంది. భూమిని రైతు ఎప్పుడు అయితే తనది అనుకొనునో అప్పుడు ఎక్కువ పంటను కష్టపడి పండించడానికి అవకాశము వుంటుంది. పండించగలుగుతాడు. వ్యవసాయోత్పత్తి అధికము కాగలదని నేను నమ్ముతున్నాను. ఖమ్మంజిల్లాలో భూసంస్కరణలు అమలు జరిపారు. కొందరు నిరుత్సాహముగా ఈ సంస్కరణలు జరిగాయిలే: "అనే మాటలు మాట్లాడుతున్నారు. జయప్రదముగా జరుగుతాయా? అని చాలమంది విమర్శచేశారు. నిజమే అనుకొన్నంతగా జరుగక పోవచ్చును గాని దానివల్ల లాభములు లేవని మాత్రము చెప్పడానికి వీలులేదు. భూసంస్కరణలవల్ల ఎంతో లాభము జరిగింది. ఆఫీసరు ఇన్‌చార్జి అయిన తహసీల్‌దారును నేను కలుసుకొని ప్రజలు ఈ విధమైన విభిన్నాభిప్రాయములు ఇస్తున్నారు, దానిని గురించి మీ అభిప్రాయము ఏమి" అని అడిగితే ఇది చాలవరకు ఉపయోగపడిందని వారు చెప్పారు.

ఖమ్మం జిల్లాలో భూసంస్కరణలు అమలు జరుపుటచేతనే కాంగ్రెసు 7 సీట్లలో 5 సీట్లు తెచ్చుకో గలిగింది. పోయిన తడవ కాంగ్రెసుకు ఒక్క స్థానము కూడా రాలేదు. ఖమ్మం జిల్లాలో ఈ భూసంస్కరణల వల్ల కొంత పలుకుబడిని

పెంచుకోగలిగింది. అందుచేత హృదయపూర్వకముగా ప్రభుత్వము ప్రజలకు ఉపయోగ పడే విధముగా భూసంస్కరణలు అమలు చేసెదరని నమ్ముతున్నాను. ఎన్ని విభేదాలు ఉన్నప్పటికినీ ఈ ప్రభుత్వము సుస్థిరముగా ఉండగలదు అని మనవి చేస్తున్నాను. ఇక minor irrigation విషయము తెలియజేస్తాను. మనం ఎప్పుడో projects వస్తున్నాయని అనుకొనడముకన్న ఇప్పుడు వెంటనే చిన్న చిన్న చెరువులను బాగుచేయించాలి. అన్ని గ్రామాలలో వున్న చెరువులను బాగు చేయించ గలిగితే ప్రజలు సంతోషిస్తారు. తమ గ్రామములకు మంచి జరిగిందని సంతోషిస్తారు. ప్రతి గ్రామములో వున్న చెరువులను మరమ్మతు చేయించాలి. పెద్ద పెద్ద projects కట్టిన యెడల అవి ఆయా ప్రాంతాలకు మాత్రమే ఉపయోగ పడుతవి ఈ చిన్న చెరువులు మరమ్మతు చేయించ గలిగితే ప్రతి గ్రామమునకు ఉపయోగముంటుంది. అందరు సంతోషిస్తారు. తగు శ్రద్ధ చూపించాలని కోరుతున్నాను. ఇక loansఉన్నాయి. ప్రభుత్వం ప్రజలకు యిచ్చే loans విషయములో చాల ఇక్కట్లు పడుతున్నారు. ప్రభుత్వము ప్రజలకు మేలు చెయ్యాలని సంకల్పించింది. కాని కొన్ని అవాంతరాలవల్ల సక్రమముగా ఈ loans అందుట లేదు. దానికికూడా సరియైన పద్ధతిని అమలు జరిపి రైతులకు అనుకొన్న ప్రకారము లాభం కలిగేటట్లు చేయాలి.

"It is no doubt, we are doing justice to the people. At the same time we must make the people feel that justice is being done to them. There is no use merely saying that we are doing justice. People must feel it and experience it and they must realise it".

వాటి మధ్య ఏమి ఇబ్బంది, ఏమి యిక్కట్లు వున్నాయి. యేయే కారణాల వల్ల ప్రజలకు అందచేయలేక పోతున్నాము? అనేది విచారించి సక్రమముగా అమలు జరిగే పద్ధతిని అనుసరించ వలసిన అవసరము వుంది. తెలంగాణ ఆంధ్ర ప్రాంతాలలో వేరువేరు rules & regulations వున్నాయి. వాటిని సమన్వయము చేసి తికమకలు లేకుండా చేయాలని కోరుతున్నాను. ఇక District Administration విషయము ఉన్నది. ఇంతకు ముందే రాజేశ్వరరావుగారు దీనిని మనవి చేశారు. Administration సరిగా జరగాలంటే districts అంత పెద్దవిగా వుండకూడదు. చిన్నవిగానే వుండాలి. అప్పుడే Collector సక్రమముగా పనులు చూసుకోవ డానికి ప్రతి పనికి తానే స్వయముగా attend అగుటకు వీలు కలుగ గలదు. Districts చిన్నవి చేసే విషయం ఆలోచించమని కోరుతున్నాను. ఇక Collectors యీనాడు అనేక burdens తో కూడి వున్నారు. Development works నుంచి Collector ను విముక్తి చేసి వాటికి ప్రత్యేకముగా development officer గారిని ఒకరిని నియమించెదరని ఆశిస్తున్నాను. ఇక public relations విషయము: ప్రజలకు ఎన్నో

complaints వుంటాయి. ఎవరిమీద complaints చేసుకో వలసి వచ్చినా వారి దగ్గరకు వెళ్ళి complaint చేసుకోడం సాధ్యము కాదని అందుచే ప్రజలకు అను వుగా ఒక public relations officer ను నియమించ వలెనని కోరుతున్నాను. ఇక failure of crops సంభవించినప్పుడు ఎక్కడ పంటలు పాడై పోయినవో తెలుసు కోవాలంటే చాలా కాలము పడుతుంది. వెంటనే reports రావు. ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క బోర్డును యీ failure of crops వచ్చినపుడు reports పంపడానికి ఒక non-official committee ని ఏర్పాటు చేయాలని మనవి చేస్తున్నాను. బకా యీల విషయములో ఒక చిన్న లోపం జరిగినదో లేక తప్పనిసరో తెలియదు. ఇంతకుముందు ఇచ్చిన వారి వద్ద బకాయీలు తీసుకొన్నారు. ఇవ్వనివారికి కొంత మందికి మాఫీ చేశారు. ఇచ్చినవాళ్ళు ఏమి అనుకుంటారు. ఇవ్వనివారికి మాఫీచేసి మావద్ద తీసుకొన్నారు అని అసంతృప్తి చెందుతున్నారు. ఇలాంటివి ఇకముందు జరుగకుండా వుండేటట్లు చూడగలరని కోరుతున్నాను. Minor Irrigation, Revenue Department క్రింద వుంకము జరిగింది. ఆంధ్రలో 200 ఎకరాలు ఆయ కట్టుగల చెరువులు మాత్రమే Revenue Dapartment క్రింద వున్నవి. తెలం గాణాలో 10 ఎకరాలు ఆయకట్టుగలవి మాత్రమే Revenue Department క్రింద వున్నవి. ఆంధ్రలో successful అయిన యీ పద్ధతిని తెలంగాణాలో కూడా అమలు జరుపగలరని ఆశిస్తూ ఈ అవకాశమును యిచ్చినందుకు తమకు అభినందనలు తెలు పుతూ విరమిస్తున్నాను.

శ్రీ డి. వి. సుబ్బారావు (పెద్దాపురం) :— అధ్యక్షా, రెవెన్యూ డిమాం డును అమోదించ వలసినదని సభవారికి విజ్ఞప్తి చేస్తూ, భూసంస్కరణలను ప్రవేశ పెట్టుటకు ప్రభుత్వం సిద్ధంగా వున్నదని కాబట్టి దీనిని అమోదించ వలసినదని మంత్రిగారు చెప్పినట్లు నాకు అర్థమైనది. కాంగ్రెస్ ప్రభుత్వం వాగ్దానాలు చేయు టలో లోటులేదు. వాగ్దానాలను భంగం చేయుటలో అంతకన్నా లోటులేదు. ఇప్పు డైనా కాంగ్రెస్ ప్రభుత్వం భూసంస్కరణలను తలపెట్టడం పోయెడిదే నని నా అభి ప్రాయం. ఇండియాలో ఏదో ఒకమూల కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చింది. వచ్చిన వెంటనే 3 నెలలలో భూసంస్కరణ బిల్లును తయారు చేసింది. కనుక వెనుక పడతామేమోననే అభిప్రాయంతో ఏదో మసిపూసి మారేడికాయచేసి, భూసంస్కర ణల బిల్లు అంటూ ఒకదానిని తీసుకువస్తామంటున్నారు.

శ్రీ కె. వెంకటరావు:— కేరళలో ఇంకను దానిని ఆమోదించలేదు

శ్రీ డి. వి. సుబ్బారావు:— 20 ఎకరాలపైన భూమి ఉన్నవారి నందరినీ లెక్కలు యివ్వవలసినదని ఆర్డినెన్సు జారిచేసిన తరువాత అంధరూ భూముల్ని

పంచుకొంటూ ఉంటే ప్రభుత్వం చూస్తూ ఊరుకొంటున్నది. ఆ పంచుకోవడమైనా కడుపున పుట్టిన పిల్లలకు పంచితే బాగుండేది. ఇంకా పుట్టని వారికి, నాలుగేళ్ళ తరువాత పుడతారని జోస్యం చెప్పినవారికి పంచడం జరిగింది. మా ఊళ్ళో కుక్క ఉన్నందుకు పన్ను ఉండేది. ఒకాయనకు ఆ అర్హతమీద ఆయనకు మునిసిపాలటీలో ఓటువుండేది. అలాగే కుక్క పేరకూడా పంచినవారు ఉన్నారు. పంపకాలు చేస్తుంటే ఊరుకున్నది ప్రభుత్వం. ఆఖరుకు పంచడానికి ఏమీలేదని చెప్పడానికి తప్పితే ఎందుకుపనివస్తాయి యీ భూసంస్కరణలు ? దున్నేవాడికేభూమి, భూమి అందరికి పంచాలి అని చాలా కాలంనుంచి కమ్యూనిస్టుపార్టీ నినాదాలుచేస్తూ ఉంటే ఎవరు బాబుగాడి భూమి పంచుతారు, ఎవరి తాతగారి భూమి, మామగారి భూమి పంచుతారు అని అపహాళనచేసే కాంగ్రెసువాదులు, తామూ భూమి పంపకం చేస్తామని మా పద్ధతులలో దిగారంటే ప్రపంచశక్తుల ఒత్తిడి అయితేనేమి, ప్రతిపక్షాల విమర్శనా శక్తివల్ల నైతేనేమి, వాళ్ళ ప్రచారప్రపంభావల్లనైతేనేమి, మా దోవలో కాంగ్రెసువారు కూడా పడ్డారని కొంచెం సంతోషిస్తున్నాను. ఆ చేసేదేదో నకిలీగాకుండా సరిగా చేయవల సిందిగా కోరుతున్నాను. భూసంస్కరణలు చేయబోతున్నామని మంత్రిగారు చెప్పారు. బాగానేఉంది అంతమట్టుకు. కానీ భూమి పంచవలయునంటే ఎన్ని ఎకరాలువస్తుందో భూమిలేనివారికి నిరుపేదలకు ఎంతభూమి పంచగలరో అనే విషయమై ఎక్కడా వారి ఉపన్యాసంలో తెలియ జేయలేదు.

శ్రీ కె. వెంకటరావు :- ఎస్సైన్‌మెంటు రూల్సును ఫైనలైజ్ చేసే విషయంలో పార్టీలీడర్సుతో కన్‌సల్ట్‌చేస్తాను, అవి తయారుగావున్నవి, అని జెప్పినప్పటికి అనుమానించడందేనికి ? నా మిత్రుడు నా డిమాండు వచ్చినప్పుడే వస్తూంటాడు పెద్దాపురంనుంచి.

శ్రీ డి. వి. సుబ్బారావు :- అది తాడిపండు కాకిన్యాయం లాంటిది. కాకి వాలినప్పుడు తాడిపండు పడిందా, తాడిపండు పడేటప్పుడు కాకివాలిందా ? పార్టీ లీడర్సును సంప్రదించి ఎస్సైన్‌మెంటు రూల్సు రూపొందిస్తామంటున్నారు. ఐతే దేశంలో ఎంత బంజరువున్నది, లెక్క తేల్చినట్లులేదు. ఏదో ఒకసారి మాట్లాడుతూ, శ్రీతిమ్మారెడ్డిగారు 40 లక్షల బంజరువున్నదని చెప్పారు. భూమి పంపకం విషయంలో ఎకరమో, అరఎకరమో వస్తే, ఏమిసరిపోతుందని ఆక్షేపించేవారు చాలామంది వున్నారు. అయితేఇపుడే లక్ష్మీకాంతమ్మగారు ఇందుకు సమాధానచెప్పారు. ఏదో కొంత భూమి అనుభవించడానికి హక్కుగలిగివున్నట్లయితే దానిని బాగుచేసుకోడానికి రైతు అన్నవాడు పాటుపడతాడు. ఏమీలేనిదానికన్న ఇదే మంచిదని సంతోషిస్తాడు. ఉత్సాహంతో రైతు ముందుకు సాగడానికి వీలుంటుంది. ఎంత తక్కువభూమి పంచినా ఫరవాలేదు. ఇదివరకు వలెకాకుండా కొద్దో, గొప్పో భూస్వామ్యవిధానంలో అభివృద్ధికరమైన మార్పులు తీసుకవస్తారని మేమాశిస్తున్నాం.

హైదరాబాదు ఏజెన్సీ ఆక్టులోని 47వ సెక్షన్ చాలాతలనొప్పికలగిస్తున్నదని వందల,వేలసంఖ్యలోకాకుండా,లక్షలకొలది అన్యాయక్రాంతాలు జరుగుతున్నవని మంత్రి గారన్నారు. 20 ఎకరాల ఆర్డినెన్సువచ్చినప్పుడు ఆంధ్రలో అన్యాక్రాంతులు జరుతుంటే ఊరుకున్నట్లే, హైదరాబాదులో కూడా వెనుకటి ప్రభుత్వం అన్యాక్రాంతాలు చూస్తూ ఊరుకొని ఉంటూవుండివుండవచ్చు అప్పుడు వున్నదికూడ కాంగ్రెస్‌ప్రభుత్వమేగదా' వారుకూడా వీరి కోవలోని వారేగదా. ప్రభుత్వానికి యీవిషయంలో శ్రద్ధ వున్నట్లయితే యిన్ని అన్యాక్రాంతాలు ఎందుకు జరుగుతాయి. ఈ అన్యాక్రాంతాలు జరిగినతరువాత ఎవరో కొందరు భూములలోవున్న తర్వాత వారిని తిరిగి వెళ్ళగొట్టడానికి చర్యతీసుకో వలసివస్తుంది. సత్వరంగా ప్రభుత్వం చర్యతీసుకోకపోయినందువల్ల యిటువంటి చిక్కులన్నీ ఏర్పడ్డాయి. ఒక శాసనమున్నప్పుడు దానిని ధిక్కరించి అన్యాక్రాంతాలు చేస్తే వాటిని రద్దుచేయటమే ముందు చేయవలసినపని. ఆంధ్రలో మద్రాసు ఏజన్సీ ల్యాండు ట్రాన్సఫర్ అండ్ యింటరెస్టు అనే చట్టమొకటున్నది. ఏజన్సీ ప్రజల యొక్క భూమిని కలెక్టరుయొక్క పర్మిషన్‌లేనిదే ఎవరూ కొనడానికి వీలులేదు. అలా అమ్మినచోట పెటిషన్స్ పెట్టినట్లయితే ఆభూమిని తిరిగి యిచ్చివేయడంకూడా కొన్ని సందర్భాలలో జరిగింది. ఆంధ్రలో సర్వీస్ ఈనామ్స్ వున్నాయి. ఈనాడు ఒక్క సర్వీసు ఈనాంకూడా సర్వీసు హోల్డరు చేతులలోలేదు. ధనిక భూస్వాములు అప్పులిచ్చి దీర్ఘకాల తణఖాలు వ్రాయించుకున్నారు. కొన్నిచోట్ల క్రియాలుకూడా జరిగాయి. వేలకొలది ఎకరాల సర్వీసు ఈనాములు యీ విధంగా అన్యాక్రాంత మైనాయి. ఇది ప్రభుత్వమునకు తెలియదా? తెలిసే ఊరుకుంటున్నది. ఐతే కొన్నాళ్లు పోయిన తరువాత ఆభూస్వామి అనుభవిస్తున్నాడు గనుక అతనికే హక్కులిద్దామని తీర్మానం చేస్తారు అంతేకాకుండా ఆభూస్వామి చేతులలో, అనుభవంలో పన్నెం డేళ్ళకుపైబడి ఆభూమి వున్నదిగనుక చట్టరీత్యా adverse possession దఖలు పరచ వలసివస్తుంది. ఇలా ఊరుకున్నట్లయితే యీ అన్యాక్రాంతాలే శాశ్వత మైపోతాయి. శాశనాన్ని దిక్కరించి చేసిన అన్యాక్రాంతాలను రద్దుపరచవలసినదే. దానిని తల నొప్పిగా భావించవలసిన పనిలేదు. భూమిపంచితే ఎకరమో, అరెకరమోవస్తే సాగు చేయడమేలా అనేవాదమొకటున్నది. కొద్దిపాటి భూములున్నట్లయితే కో ఆప రేటివ్ ఫారమ్స్ ప్రవేశపెట్టవచ్చు. మంత్రిగారి ప్రారంభోపన్యాసంలో భూసంస్కరణలు చేయబోతున్నామన్నారేగాని, యీ ప్రధానమైన విషయాన్ని వారు ఉదహరించలేదు. కేంద్ర ఆహారశాఖ ఉపమంత్రి శ్రీ యం. వి. కృష్ణప్ప గారు చైనాలోని వ్యవసాయ సంస్కరణలను గురించి వ్రాసిన నివేదికను విన్ననే చదవడం తటస్థించింది. చైనాలో సహకార వ్యవసాయం అత్యద్భుతమైన ఫలితాలను చేకూర్చగలిగిందని వారు చెబుతున్నప్పటికి కూడా, చైనావారు ఆ పని చేశారు గనుక మనమెందుకు చేయాలనే భావం ప్రకటించడం మంచిదిగాదు. చైనాలో ఉపకరించింది

గాబట్టి దానిని ఎలా అవలంబిస్తామని సందేహించనక్కరలేదు. కోపరేటివ్ ఫార్మింగులవల్ల ఎంతో ఉపయోగమంటుంది.

ఇంటిగ్రేషన్ ఆఫ్‌లాస్ గురించి మనవిచేస్తాను. డిఫరెన్సు, డిస్పారెటీ లేకుండా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతములలో వున్న చట్టముల నన్నిటినీ సమన్వయం చేయడం మంచిది. ఇందుకు ఒకలా కమిషన్ నియమించాలి. కేవలం ఉద్యోగులతోనే కాకుండా యీ చట్టములతో నిత్యం సంబంధం వుండి, న్యాయవాద వృత్తితో వున్నవారిని కూడా యీ లా కమిషన్‌లో సభ్యులుగా చేర్చినట్లయితే చాలా బాగుంటుంది. అధ్యక్షులవారు నన్ను సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీలో మెంబరుగా వేశారు. మా కమిటీ ముందు పరిశీలనార్థమై వచ్చే రూల్సును చూచినట్లయితే, అవి చాలా లోప భూయిష్టంగా వున్నట్లు బోధపడుతుంది. కాబట్టి అనుభవం వున్న లాయర్లను లా కమిషన్‌లో నియమించినట్లయితే, ఉభయ ప్రాంతములలో వున్న శాసనములను ఇంటిగ్రేట్ చేయడం సులభమవుతుంది.

రెవెన్యూ డిపార్టుమెంటు అంటే ప్రజలలో వుండే తలనొప్పి యింకే డిపార్టు మెంటు పట్ల వుంటదు. ఇందాక శ్రీరామమూర్తిగారు చెప్పినట్లు ఒక కాగితం రెవెన్యూ డిపార్టుమెంటు ఆఫీసరుకు పంపితే దానికి యిక అతీగతీ ఉండదు. తహశీల్‌గారిదే సర్వాధికారాలూను. డిలేస్ అనేవి పెద్ద జాడ్యంగా తయారయినవి. టెనెన్సీ యాక్టుక్రింద, యీనాం ఎబాలిషన్ యాక్టుక్రింద పెటిషన్లు పెట్టుకొంటే తబ్సీళ్లు యివ్వవలసిందని రెవెన్యూ డిపార్టుమెంటులోని ఉద్యోగులు దరఖాస్తుదారులను కోరుతారు. రైతులకు చాలామందికి చదువురాదు. అటువంటివారు తబ్సీళ్లు ఎలా యివ్వగలరు? పట్టానెంబరు అజమాయిషీ నెంబరు క్రైమాయిషీ నెంబరు తెలయవు. కరణాన్ని అడిగితే చెప్పడు. తాలూకాకచేరికి వెడితే అక్కడవాళ్లు మాట్లాడనే మాట్లాడరు. అతను పెట్టుకున్న దరఖాస్తుకు అతీగతీ ఉండదు. జమాబందీలో పెనాల్టీవేస్తే దానికి అపీలు చేయాలనినకలు దరఖాస్తు పెడితే ఆరునెలలు అయినా దానికి సమాధానం రాదు. అందువల్లనే ఎవరికీ రెవెన్యూ డిపార్టుమెంటువారిమీద గౌరవముండదు. అటువంటి పరిస్థితులలో యీ పద్దును ఆమోదించడమెలా? యీ శాఖలో సంస్కరణలుచేసే విషయంలో మహా మేధావులైన మంత్రిగారు యింతవరకు ఏమి చేశారు? ఆయన రెవెన్యూ మంత్రిగా ఉండటం యిది మొదటిసారికాదు. ఇదివరకుకూడా వారు రెవెన్యూ మంత్రిగా ఉన్నారు. అయినప్పటికీ ఫలితమేమీ కనబడలేదు. మాజీ జమీందారీ ప్రాంతాలలో సీటి సరఫరా — మైనర్ ఇరిగేషన్ — రెవెన్యూ డిపార్టుమెంటు చేతులలో వున్నది.

శ్రీ కళా వెంకటరావు:- క్రిందటిమారు నేను రెవెన్యూ మంత్రిగా వున్నప్పుడు నాకు శ్రీ సుబ్బారావుగారి సలహా వుండేది. ఇప్పుడు కొంచెం తగ్గింది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:- అప్పుడు గదులలో యిచ్చేవారు ఇప్పుడు బహిరంగంగా చెబుతున్నారు.

శ్రీ డి. వి. సుబ్బారావు:— మా తాలూకాలో ఏలేరువల్ల కొంతభూమి సాగవుతున్నది. జమీందారుల కాలంలో 18 రోజులకు ఒక వంతు ఉంటే, జమీందారీ ఉద్యోగులు ఖచ్చితంగా దాని నమలు జరిపేవారు. ప్రభుత్వం వారు జమీందారీలను స్వాధీనం చేసుకున్న తరువాత ఏటి కాలువలకుగాని, కట్టలకుగాని, మరమ్మతులు లేవు. వంతులు సరిగా పాటించడంలేదు. "స్వరాజ్యం వచ్చింది. ఉపకారం జరుగుతుందనుకొంటే కొండనాలుకకు మందువేస్తే వున్ననాలుక ఊడిపోయినట్లుగా అయినదేమిరా భగవంతుడా" అని రైతులు బాధపడే పరిస్థితి ఏర్పడింది. జమీందారీ ప్రాంతాలలోని రైతులకు ప్రభుత్వం ఏవిధమైన సౌకర్యాలు కలుగజేయడంలేదు. ప్రభుత్వదృష్టి యీ వెనుకబడిన ప్రాంతాలవైపు ప్రసరించాలి. ఎస్టేటు ప్రాంతాలలో మైనర్ ఇరిగేషన్ సౌకర్యాలు కలుగజేయాలి.

తరువాత విలేజి ఆఫీసర్ల జీతాలవిషయంలో హెచ్చుచేశామన్నారు. వారు ఆందోళన చేసినతరువాత ఒకకమిటీవేశారు. మూడురూపాయలలో ఐదురూపాలో వేసి, చివరకు ఉద్యోగాలు తీసివేస్తామని బెదిరిస్తే కొన్నిచోట్ల ఉద్యమం ఆగిపోయింది. ఇంతకంటే తక్కువఆదాయం ఉండే రాష్ట్రాలలో హెచ్చుచేయటానికి సావకాశము ఉంటే, ఇక్కడమాత్రం చేయటానికి మనసుఉంటే మార్గములేదా అని అడుగుతున్నాను. అసలు ఆలోచన ఉంటె అవకాశములేకుండా ఉన్నదా? అని అడుగుతున్నాను. వాళ్లకు యివ్వకూడదనే ఉద్దేశంగాని, లేకపోతే ఒక గ్రామోద్యోగికి యిచ్చేజీతం ఒక ధాన్యపుబస్తా కొనుక్కోడానికి సరిపోతుందా అని మనవిచేస్తున్నాను. సామ్యవాద సమాజము స్థాపించుట మా ఆశయమని ప్రభుత్వంవారు చెబుతున్నారు. ఆశయం బాగానేఉన్నది. కోరికలు కోటలుదాటుతాయి, కాళ్లు గడపలుదాటలేవు. వాళ్లకు ధాన్యపుబస్తాకు సరిపడేజీతమైనా యివ్వవకపోతే ఎట్లా పనిచేయాలి? చేయకపోతే misappropriation cases పెడతామంటారు, ఏమి సబబు అది? ఆ మాత్రం జీతంహెచ్చుచేయటానికి ప్రభుత్వ ఖజానాలో డబ్బులేదా?

శ్రీ కె. వెంకటరావు :— Misappropriation అయితేగాని వకాల్తానామా రాదా?

శ్రీ డి. వి. సుబ్బారావు:— డబ్బుఉన్నవాళ్లవస్తే పుచ్చుకుంటున్నాను. బీదవాళ్లవస్తే లేదు. గద్దలుకొట్టి కాకులకుపెడుతున్నాను. నేనుచేసేపనే అది.

మిస్టర్ స్పీకర్:-మీకు తోచినది చెప్పండి. You have freedom of speech. So long as it is not unparliamentary or indecent you can go on as you like.

శ్రీ డి.వి. సుబ్బారావు :—పరిశ్రమలమీద వచ్చేఆదాయానికి లిమిట్ పెట్టకూడదని అపుచేయాలనే సమస్యఉన్నదని ప్రశ్నలు pose చేస్తూ చెప్పారు. గోపాలరెడ్డిగారు ఒకమాట కర్నూలులోచెప్పింది జ్ఞాపకం వస్తున్నది. 800 ఎకరాలకు లిమిట్ చేసి సీలింగ్ పెట్టాలని చెప్పారు. పేపర్సులోపడింది, మరిపేపర్సుదితప్పితే—ఒకసున్నా ఎక్కువపెట్టాడో, ఒకసున్నా తక్కువపెట్టాడో నాకు తెలియదుగాని పేపర్సులో పడింది 800. అలా పెట్టితేమాత్రం మీ భూసంస్కరణలు అసలేఅక్కరలేదు అని చెప్పగలచుకొన్నాను. ఎందుచేతనంటే, ఒక్కడూ ఆ లిమిట్ లోకిరాడు, నెహ్రూ అడ్డుపెట్టరు కాబట్టి పరిశ్రమలమీద ఆదాయానికి లిమిట్ పెట్టకూడదన్నారు. అయితే భూస్వాముల ఆదాయంమీదకూడా లిమిట్ పెట్టకూడదని మంత్రివర్గములోని ఒక ప్రముఖ మంత్రిగారే అంటూంటే, ఈ భూసంస్కరణలు ఎలా అమలుజరుగుతాయో నాకు తెలియదు. ఈ సందర్భంలో ఒకచిన్నమాట జ్ఞాపకం వస్తుంది. ఒకనికి ఇద్దరు పెళ్లాలుఉన్నారు, పడుచుపెళ్లాం అతనితలమీద తెల్లవెంట్రుకలున్నీ, ముసలి పెళ్లాం నల్ల వెంట్రుకలన్నీ తీసివేసినారట. పోతే బట్టతల, బోడితల మిగిలింది. అందువల్ల ప్రజలకు కూడా అంతేమిగులుతుందేమోనని నాకు అనుమానముగా ఉన్నది.

శ్రీ యన్. వెంకయ్య (అద్దంకి):-అధ్యక్షా, బడ్జెటుటైమునుంచి మాట్లాడాలని ప్రయత్నిస్తూంటే నేటికి నాకు అవకాశం యిచ్చారు.

మిస్టర్ స్పీకర్:-మీరు యిప్పుడు నాదృష్టికితెచ్చారు. పిలిచాను.

శ్రీ యన్. వెంకయ్య: —జమీందారీ విధానం రద్దు శాసనం అయిన 10 సంవత్సరాల తరువాత యింకాకొన్ని ఎస్టేట్లు తీసుకోకుండా నిలవఉంచటం విచారకరం.

శ్రీ కె. వెంకటరావు:-5,800 తీసుకొన్నాము, యింకా 9 ఉన్నవి.

శ్రీ యన్. వెంకయ్య:- ఈనామ్ ఎస్టేటు, ముఖాసా ఎస్టేట్లు యింకా వేయికిపైగా ఉన్నవి. నేడు సెటల్ మెంట్ జరుగుతోంది. కాని యీ సెటిల్ మెంట్ విధానం రైతులకు చాలా అనర్ధంగా కనబడుతున్నది. ఇదివరకు తయారుచేయబడి నిర్ణయించబడిన సింగిల్ పట్టాలు ఈరోజున సర్వే నెంబరుకు ఒక పట్టాచేస్తున్నారు. తరములమార్పులకుకూడా హంసాయీ గవర్నమెంటురేటుకన్న విపరీతంగా రేటు హెచ్చించుట జరుగుతోంది. ఇదివరకు ఉన్న గ్రామమొత్తము రెవిన్యూకు మించిపోతుంది. ఈరోజున సర్వేజరుగుతోంది. రఫ్ పట్టాలుయిస్తున్నారు. అనేకదోషాలు ఉన్నాయి. వాటికి రైతులు అప్లికేషన్ యిచ్చుకొని మార్పులు చేసుకొనుటకు ముందుగా 20 రోజులు టైముపెట్టి యిచ్చి, ఆఖరురోజున

లోగడతేదిలు పట్టాలు యిప్వటం ద్వారా ఆక్షేపణలు తెలుసుకొనే అవకాశం లేకుండా పోతున్నది. తరతరాల అనుభవిస్తున్న భూములు, యీరోజున పట్టా land కాదని లాగిపారేస్తున్నారు. ఇటువంటి అక్రమాలు సవరించాలి.

ఇక తెలంగాణాలో భూమివిధానం విషయంలో జరుగుతున్న అక్రమాలు అంతా, యింతా కాదు. 15,20 సంవత్సరాలక్రింద కొన్న భూములు, రిజిస్ట్రేషన్ అయి దరఖాస్తులుకూడా పెట్టి, అన్నివిధాలైన కార్యక్రమాలు ముగించుకొన్నాకూడా నేటికి పట్టాలు యివ్వకుండా "ఈ భూమినాది" అని అనుకునేందుకు ధైర్యంలేకుండా ఉన్నారు. రెవిన్యూ డిపార్టుమెంటుకు పనిభారమో, మరి ఏమికారణమో, పనులు జరుగుతున్నట్లు కనపడలేదు. ఇంకా ఎన్నో దోషాలు సంక్రమించాయి. కనీసం మైనరు ఇరిగేషన్ పనులైనా అ డిపార్టుమెంటునుంచి తప్పించి తక్కువఖర్చుతో నిర్వహింపబడగలందులకు, వ్యవసాయశాఖకో, లేక P.W Department కో యివ్వాలని కోరుతున్నాను. మైనరు ఇర్రిగేషన్‌క్రింద చిన్న చెరువులు ఎన్నో ఉన్నాయి. నూరుఎకరాలకు సరిపడే నీరుఉండే చెరువయితే 200, 300 ఎకరాలకు నీరుయిస్తున్నారు. రెండుమూడు మాసాలకన్న నీరు, ఎక్కువ ఉండటంలేదు. వరదలువస్తే చెరువులు తెగిపోతున్నాయి. ఇంజినీర్సులోటా? అసలు విధానములో లోటా? చెరువులకు అలుగులు యింకా విశాలంగా కట్టాలి. చెరువుల మరమ్మతులు కూడా సక్రమంగా జరుగుట అవసరం. చెరువులక్రింద ఆయకట్టుకూడా నిర్ణయించాలి. ఈ మైనరు ఇరిగేషన్ పనులు చౌకగా నిర్వహించుటకు వ్యవసాయ శాఖకు వప్పగించాలని కోరుతున్నాను.

భూసంస్కరణలగురించి మనము ఎంతెంతో మాట్లాడుకొంటున్నాము. పంట వృద్ధిచెందాలని, సాంఘీకన్యాయం అమలుజరగాలని అంటున్నారు ఆ రెండూ తప్పక దృష్టిలోఉంచుకొని సలహాలు యిస్తారని అనుకొంటున్నాను. సాంఘికన్యాయం ఎలా అమలు జరుగుతుందో ఆలోచించండి. భూమి ఒక పంచాయితీకి వప్పజెబితే జరుగుతుందా? లేక ఒక అధికారసంస్థక్రింద పెట్టితే సరిపోతుందా? లేక రెండు మూడెకరాలు చేస్తే సమానం అవుతుందా? ముందు ప్రభుత్వంలో సంస్కరణ ఎందుకు తీసుకురారు? ప్రభుత్వోద్యోగులు 24 వేల రూపాయలు, సంవత్సరమునకు తీసుకొంటున్నా అభ్యంతరం లేనప్పుడు, ఆకర్షనీయంగా ఉన్న ఉద్యోగులకోసం, వ్యాపారాలకోసం, కార్మిక వృత్తులకోసం, వ్యవసాయవృత్తి వదిలిపోతారు. వ్యవసాయం ఆకర్షనీయం కాకుండా ఎందుకుచేస్తున్నారు? ప్రభుత్వంయొక్క ఉద్దేశమేమిటి? ప్రజాస్వామ్యం నిలుస్తుందని ఒక సోదరీమణి అన్నారు. ప్రజాస్వామ్యంలో ఓట్లు వ్యవసాయకూలీలు ఒక పార్టీకి, రైతులు ఒక పార్టీకి గ్రామాలలో యివ్వటంలేదా? రెండుమూడు ఎకరాలు వ్యవసాయమన్నేది లాభకరం కాదుకదా?

అటువంటప్పుడు పంచాయితీ వ్యవసాయమో, సహకార వ్యవసాయమో తీసుకు వచ్చినప్పుడు, ఆ వ్యవస్థ బలపడినప్పుడు ఆ వ్యవస్థకు సంబంధించిన పెత్తందార్లు ప్రజాస్వామ్యానికి విరుద్ధముగా ప్రవర్తించరని, ఏ ఒక్క పార్టీ ఓట్లకోసం నిర్బంధించకుండా వదులుతారని ఎలా అనుకోవడం? అసలు భూస్వాములు అంటే ఎవరో నిర్ణయించాలి. భూస్వాములంటే వందలకువందలు ఎకరాలున్నవారని నా అభిప్రాయం. జమీందార్లను తొలగించాలనే పోరాటము 20 సంవత్సరములు నడిపినవాడిని నేను ఈరోజున నేను వారియందు పక్షపాతముగా ఉండటం విపరీతం కాబట్టి పక్షపాతిని కాను, కాజాలను. వందఎకరాల లోపువారుకూడా భూస్వాములా? నా నిర్వచనంవేరు. వందలకొలది ఎకరాలుకలిగి, తాము వ్యవసాయముచేయలేక మరొకరిచేత చేయించేవారిని నేను సమర్థించను.

మిస్టర్ స్పీకర్:- రేపు అయిదు నిమిషములు మాట్లాడవచ్చును. ఈ సమావేశం రేపు ఉదయం 8-30 గంటలకు వాయిదావేయబడినది.

*The House then adjourned Till half Past Eight of the Clock on Tuesday the 11th March 1958.*

---